ఆంధ్రవిజ్ఞానసమితి. నె ౨ రు.

# విస్మృతకళింగాంధ్రకవులు

## ప్రథమ భాగము.

కృతికర్త.

శ్రీ అడిదము రామారావుపంతులుగారు,

(రిటైర్డుసీనియరు తెలుఁగుపండితులు, శ్రీమహారాజావారి కాలేజి, విజయనగరము

ఉపాధ్యక్షులు, ఆంధ్రవిజ్ఞానసమితి.)

ప్రకాశకులు:

ఆంధ్రవిజ్ఞానసమితి,

విజయనగరము.

ప్రథమముద్రణము, జూన్ 1940.

వెల రు ౧-౦-౦.

రావుసాహేబు, వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్యగారు,

బి. ఇ. యం. ఐ. ఇ.

అధ్యక్షులు:-ఆంధ్రవిజ్ఞానసమితి,

విజయనగరము.






కాకినాడముద్రాక్షరశాల,
కాకినాడ.

# విజ్ఞప్తి.

పరిమళములలోఁ గస్తురి, తరువులలోఁ జందనంబు దైవంబులలోఁ
బరమేశుఁడు విద్యలలో, నరయంగాఁ గవితయొక్కఁడగునని రాజ్యల్.

సమగ్రమును, సప్రమాణమును, శాస్త్రీయమును నగు వాఙ్మయచరిత్రమునకుఁ గవులచరిత్రము ముఖ్యాంగము. ఆంధ్ర వాఙ్మయమునఁ గవులచరిత్రములు సంపూర్ణముగ లేవు. ఆంధ్ర కవులజీవితచరిత్రములను నధునాతనపథకమునఁ దొలుత శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులువా రుద్యమించి, కతిపయ చరిత్రలను రచియించిరి. ఆవెనుక శ్రీ కందకూరి వీరేశలింగము పంతులువారు ఆమార్గమునఁ బెక్కుచరిత్రలను బ్రకటించిరి. వీరిరువురు వ్రాసినగ్రంథములలోఁ గవికులగోత్రభేదవిచారణ, కాలనిర్ణయచర్చ, గ్రంథకర్తృత్వవివాదము, మున్నగునవి హెచ్చుగానుండి, సాహిత్యపరిణామమును గాని, సారస్వతచరిత్రమును గాని, తెలుపుటకు నాగ్రంథములు సహాయకారులుగ నుండలేదు. అయినను, తమకాలమునఁ దమకు లభ్యమగుసాధనసంపత్తితోఁ గవిజీవితములను రచియించి, నేఁటివఱకుఁ దమ గ్రంథములే యాధారములైనట్లు వెలయించినవారిరువురకు మన మెంతయేని కృతజ్ఞత చూపవలసియున్నది. వారికాలమునకంటె

నిప్పు డపారముగ, కవులచరిత్రలనుఁ గూర్చి సాధనములు లభించుచున్నను, సంపూర్ణమును, సప్రమాణమును, చారిత్రక విమర్శశోభితమును నగు కవులచరిత్రము నేఁటికిని మనకుఁ గొఱంతయేకదా !

సంపూర్ణాంధ్రకవిచరిత్రమునకు నాయామండలముల యందలి కవులగూర్చినచరిత్రములు దొలుత బూర్తిగఁ బ్రకటింపబడవలయును. ఆయాప్రాంతములనున్న కవులఁగూర్చి, తత్ప్రాంతవాస్తవ్యు లెఱుంగునట్లు, పైవా రెంత పరిశ్రమముఁ గావించిన నెఱుఁగుట తటస్థింపదు. ఇంకను, దూరస్థులగుచో మనయజ్ఞానముచే వారిని గూర్చి లేనిపోని విషయములుకూడ వ్రాయుటయగును. ఇట్టిలోపములు పూర్వకవిచరిత్రలను జూచిన నెన్నియేని కానుపించును. మఱియు, జరిత్రకెక్కకుండ సంప్రదాయసిద్ధములై యాయాకవికుటుంబముల నిలిచియుండు చారిత్రకవిషయము లాస్థలజ్ఞులకుఁ దెలిసియున్నట్లితరు లెఱుంగుటయు వీలుపడదు. కావున, నేయేమండలమువా రాయామండలములఁగల కవులచరిత్రలను, గ్రంథములను, సేకరించి, కవిచరిత్రలు ప్రకటించినచో నాంధ్రవాఙ్మయచరిత్రమునకు వారు మేలొనగూర్చువారగుదురు. మఱియు, నాంధ్రతనుగోరు నిక్కాలమున నిది వారికర్తవ్యమని మాయభిప్రాయము.

ఇట్టియుద్దేశములతోఁ గళింగదేశమందలి సుప్రసిద్ధులగు కొంతమంది కవులఁగూర్చియీతొలిభాగము ప్రకటింపఁబడినది.

కాలక్రమమున తక్కినభాగములు వెలువడగలవని యుద్దేశించు చున్నారము. ఈభాగమున కేవలము, కాలనిర్ణయాదులేగాక, కవికృతకావ్యమునుగూర్చి విమర్శనదృష్టితోడను, నుదాహరణములతోడను పెక్కువిషయములు సంతరింపబడి, కవికిని, కావ్యమునకును సమానప్రాధాన్య మొసంగబడినది. ఆంధ్రసాహితీవేత్త లావిషయమును గమనింతురుగాక !

కృతికర్తలగు శ్రీ అడిదము రామారావుపంతులువారు సుప్రసిద్ధకళింగాంధ్రకవికుటుంబమునకుఁ జెందినవారగుటచే సంప్రదాయసిద్ధముగను, పట్టభద్రులకుఁ బాఠములుచెప్పినవారగుటచే, నద్యతన చారిత్రకవిమర్శనపద్ధతుల కనువగునట్లును, యీకృతిని రచియించి మాసమితి కొసంగినందు కెంతయు కృతజ్ఞులము.

ఇట్లే మనయాంధ్రదేశమున నాయామండలములవారు తమమండలకవులచరిత్రములను బ్రకటించి యాంధ్రభాషాభ్యుదయమునకుఁ దోడ్పడుదురేని మాయాంధ్రవిజ్ఞానసమితి పరిశ్రమము సార్థకమై, మాయాశయములు సఫలీకృతము లగునని విన్నవించుచున్నారము.

ఇట్లు,

విజయనగరము,
1-6-1940.

వేమకొమ్మ గురువేంకటసుబ్బయ్య,
అధ్యక్షులు.



ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున

కవులజీవితచరిత్రములను వెలయజేసిన,

కీ. శే. రావుబహద్దూరు,

శ్రీకందుకూరి వీరేశలింగంపంతులు,

శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులు వార్ల

స్మారకచిహ్నముఁగ నీకృతిగావింపఁబడినది.

కృతికర్త.

# పరిచయము.



ఈవ్యాసగుచ్ఛమునకు "ముందుమాట" వ్రాయుమని నియోగించి యీసమితికార్యకర్తలు నాకుచేసిన గౌరవమునకు నేను వారికెంతయు కృతజ్ఞుఁడను. ఈకృతివిశేషములు కొన్నిమనవి చేస్తాను చదువరులు గమనించతగినవి.

ఈవిశాఖపట్టణముమండలములో బ్రాహ్మణకుటుంబములలో నార్వేలనియోగులలో అడిదమువారు కవికులతిలకులై ప్రఖ్యాతిగన్నవారు. వారిలో మ॥ రా॥ రా॥ శ్రీరామారావుపంతులుగారు, ఈగ్రంథరచయిత, శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాజావారి ఆంగ్లకళాశాలలో "డిగ్రీ" క్లాసులకు ప్రథానాంధ్రపండితులుగానుండి, పాండిత్యవిలసితమును, విమర్శావిశిష్టమును, నాగరకమును,అయినబోధనావిధానముచే చాలమంది విద్యార్థులను తరింపఁజేసి ,ఆంధ్రాయూనివర్సిటీ (వాల్తేరు)లో పాఠ్యనిర్ణాయకసభకును, పరీక్షాధికారిత్వమునకును ఎన్నికగని యాంధ్రోపాధ్యాయులలో మాననీయులైరి. ఇట్టి ప్రవృత్తియందుండియే కొన్నిసంవత్సరములక్రిందట "ఆంగ్లకవి జీవితముల" (English Men of Letters) మార్గమున "అడిదముసూరకవి" జీవితమును విపులముగా రచించిరి. అది యాంధ్రుల నుతికెక్కినది. శ్రీకందుకూరి వీరేశలింగంపంతులుగారును, శ్రీగురు

జాడ శ్రీరామమూర్తిపంతులుగారును మాకు మునుపటితరము వారు, ఆంధ్రకవులచరిత్రములు" జీవితములువ్రాసిరి. అవి పాఠ్య గ్రంథములుగాచెప్పిన శ్రీరామారావుపంతులవారాఫక్కీ నవ లంబించి, ఆగ్రంథములోని కెక్కియుండని యీప్రాంతపుకవుల జీవితములు వ్రాయుట కుత్సహించిరి. అందుకువలయు తాళప త్రప్రతులు మొదలైనవి వారికి సహచరులమగు మిత్రచ్ఛాత్రులము కొన్నిసంపాదించి యిచ్చితిమి. కాగా యీవ్యాసావళి ప్రచురణకు వచ్చినది. ఆయాపత్రికాధిపతులు వీటికి తావిచ్చి గౌరవించిరి. అవియన్నియు నిప్పు డీవిద్యాసమితివారి సమాదర ణమున నీకృతిరూపమున ప్రకటింపబడుచున్నవి.

ఈవ్యాసములు దిఙ్మాత్రవిషయ నిరూపణముగలవై, మార్గోపదేశమాత్రకములేయై, వర్ణితాంశముల విపులవిమర్శ లను సూచించునవైయున్నవి. తాడూబొంగరములేని, కేవల యూహామాత్రమై సాహిత్యవినోదమునకైనా తాడూబొంగర ము కల్పించుటయన్నదికూడా యెన్నికైన చాకచక్యమే. అగ మ్యగోచరమై అడివిబలిసిపోయి విస్మృతమైన ప్రాంతములో విజ్ఞానమతములజాడలలో బయలుదీయగలుగుట ప్రయత్న మాత్రమేఅయినా విజ్ఞానపరిషత్తులం దుగ్గడింపబడుచున్నది. ఈ వ్యాసావళియందలి ప్రయత్నమున్ను అట్టిదేకాగా దీనివల్ల శ్రీ భారతీతీర్థకుల పత్యధిరాజులగు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజాసాహిత్య సమ్రాట్టువారి ప్రశంసయు శ్రీవారివల్ల

"విమర్శావిశారద" బిరుదపట్టమును శ్రీ రామారావు పంతులు గారికి లభ్యమైనవి. లౌకికముగా చూచినయెడల "ఆంధ్రకవులు తుని కుత్తరముగాగల ఆంధ్రకుటుంబములలో నెన్నడు జేరనియు కళింగమను నీప్రాంతములో వాడుకలోనుండినభాష ఆంధ్రాపభ్రంశమనియు, కృష్ణాగోదావరీమధ్యగల ఆంధ్రవిమర్శకుల భ్రమప్రమాదజనితమగు అపవాదమున" కీకృతిజవాబు. ఆ విమర్శకులు నన్నయతో సమకాలికమగు కళింగమండలశాసనములలో "నన్నయసీసముల"వంటి సీసపద్యముల కనపడుట అనేక పత్రికలలో ప్రకటితమయ్యుండినను తమతమ వాసస్థలముల యందలి మమకారముచేత నీయంశమును మరచుచుందురు. శ్రీరామారావుగారు "అడిదము సూరకవి" అనుకృతిని ప్రకటించినతరువాతకూడా చెన్నపురిప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము గ్రంథసూచికలు (Catalogues) తద్రచయితలు సూరకవిగారిని "గోదావరిజిల్లా రామచంద్రపురం"వారినిగా బేర్కొనిరి. ఈకారణముచేతనైనా యీకృతి బహుళీకరింపతగినదే. ఆంధ్రసారస్వతములో నిలిచియుండతగినదే. గాంచవలసినదే.

కాని మరియొకమాట: పరమార్థవిషయము, పౌరుషజీవనులమగు మా బ్రాహ్మణనియోగిజాతములకు "జీర్ణోద్ధారకము" విధిగా మావంశీయులలో ప్రసిద్ధపురుషులకీర్తి విశేషమై, మాకు వంశపారంపర్యమగు నుపదేశమైయున్నది. అది సప్తసంతానములలో గణనీయమగు కృతిరూపమున నిందు నిర్వహించి, కళిం

గాంధ్రకవులసుకృతముల నుద్ధారణలోనికి తెచ్చు "పరిచయవ్యాసములు" వ్రాసి శ్రీ రామూరావుపంతులుగారు తమ అడిదము వారి బిరుదు సమర్థించి, జీవితపారమార్థికమును సాధించినారు. ధన్యులు. వందనీయులు.

భారతీతీర్థము
విజయనగరం,
24-5-1940.

ఇట్లు బుధవిధేయుడు,
**బుర్రా శేషగిరిరావు,**
ప్రధానిశేఖర; ఎం. ఏ; పి.ఎచ్.డి.డి.లిట్; ఎం.ఎస్.ఎ.

శ్రీ ర స్తు.

# పీ ఠి క.

చాళుక్యనృపుఁడు రాజరాజు కాలమగు క్రీస్తువెనుక 11 వ శతాబ్దమునాఁటికే యీప్రాంతమగు కళింగదేశములో నన్నయ భట్టు సీసపద్యములవంటి పద్యములు శాసనములలోఁ గాన వచ్చుచున్నవనుటకు గంజాంమండలములోని నరసన్నపేటకు సమీపముననున్న "దీర్ఘాసి" గ్రామములోని శిలాశాసనము నిద ర్శనముగానున్నది. దీని కుపబలముగా 18 వ శతాబ్దమధ్యభాగ మున జీవించియున్న అడిదము సూరకవి చాటుపద్యమొకటి కళింగదేశాంధ్రవాఙ్మయాభివృద్ధిని సూచించునదిగా నున్నది—

ఉ. "ఇరువదిమూఁడుపూరుషము లిప్పటికయ్యెఁ గవిత్వవృత్తిచే
నరపతు లెల్లమెచ్చఁ బదునాల్గుతరంబులు మించు పిమ్మటన్
వెరవగు జీవనస్థితి లభించుట; తొమ్మిదియయ్యెఁ బూరుషాం
తరములు నిక్కళింగవసుధాధిపుచెంగట నాశ్రయించుటల్"

దీనినిబట్టి యాలోచింపఁగా నన్నయకాలమునుండియు నీప్రాంతమగు కళింగదేశములో నాంధ్రసారస్వతము వెలసి ప్ర చారములోనున్నట్టుగ నూహింప వీలగుచున్నది. సూరకవికి ముందుఁ దొమ్మిదితరములనుండి యతనివంశమువారు కవితా వృత్తిచేఁ గళింగరాజులయాశ్రయము గలిగియుండిరనియు, నంత కుఁబూర్వము పదునాలుగుపురుషాంతరములనుండి యతని వంశజులు కవితావృత్తిచేతనే జీవనోపాధి కల్పించికొని యుండి

రనియుఁ దెలియవచ్చుచున్నది. అంతియగాక యీకళింగరాజ్యములోని రాజులు-శ్రీవిజయనగరము పూసపాటివారు, బొబ్బిలి రావువారు ప్రాచీననందాపురాధీశులు (ఇప్పటి జయపురపరిపాలకులు) పర్లాకిమిడి ప్రభువులు, మున్నగుభూపాలులందఱును నాంధ్రకవిత్వము నాదరించి, కవులను పోషించుచువచ్చినట్టుగా నిదర్శనము లుండుటచే నాంధ్రదేశమందలి యితరసీమలవలె నీకళింగదేశముగూడ వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడినదనియు, సారస్వతచరిత్రమున నగ్రస్థానము నాక్రమించు కవిపుంగవు లిచ్చట వెలసిరనియు నిరాక్షేపముగాఁ జెప్పవచ్చును. శ్రీకృష్ణదేవరాయలజనకుఁడగు వీరనరసింహరాయల యాస్థానకవియగు "మాదయ్య"యను నాతఁ డీకళింగసీమకు వచ్చినప్పుడు, నందాపురాధీశులును, పర్లాకిమిడిప్రభువులును నతనిని సమ్మానించినట్టుగా నీక్రిందిసీసపద్యపాదములవలన స్పష్టమగుచున్నది:-

"కాంచినాఁడవు కనత్కాంచనాభరణంబు
లేపారనందాపురీశుచేత
అందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును
కిమిడిభూమండల రమణుచేత
గీ. ... ... ... ... ... ... ... ... ... ... ...
ప్రోడవన్నింట సర్వయమాదసుకవి"

ఇట్టినిదర్శనములున్నను ప్రాచీనతరములగు గ్రంథములు అనఁగా 12-15 శతాబ్దముల మధ్యకాలమున రచియింపఁబడ్డవి

దురదృష్టవశమునఁ గాలగర్భమునఁబడి ఖిలమైపోయి యుండ వచ్చును. లేదా క్రిమిదష్టములగుచు, శిథిలావస్థలో నేగ్రామమునందైనను గుప్తములై యుండవచ్చును.

యుగపురుషుఁడని "ఆంధ్రవాఙ్మయచరిత్రము" నందుఁ బ్రసిద్ధిఁగాంచిన కీ. శే. రావుబహాదూరు కందుకూరి వీరేశలింగముపంతులవారి కవులచరిత్రమును, ప్రప్రథమమునఁ గవిజీవితములు వ్రాసి యాంధ్రలోకమునకుఁ జవిఁజూపిన కీ. శే. గురుజాడ శ్రీరామమూర్తిపంతులవారి గ్రంథమును చదివినపిమ్మట నీమహనీయు లిరువురకును కళింగదేశకవుల చారిత్రాదికములు లభ్యముకాలేదన్న సందియము కాలేజీలో విద్యార్థిగానున్న కాలముననే నాకుఁ గలిగినది. ఇటీవల 10-15 సంవత్సరముల నుండి యీ "విస్మృతకళింగాంధ్రకవుల" కృతులను సంపాదించుటయందును, వారిజీవితచరిత్రములను సేకరించుటయందును, కృషిచేసి కొంతవరకుఁ గృతార్థుఁడనైతిని. నేఁజేసినపరిశోధనాన్వేషణముల ఫలితమే యీవ్యాసావళి. ఈవ్యాసములలో కొన్ని "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" లోను శ్రీవిజయనగరం మహారాజావారి "కాలేజీమాగ్జిన్"లోను నప్పుడప్పుడు ప్రచురించుచు వచ్చితిని. వాటిపైని విద్యాధికులు కొందఱిడిన యమూల్యాభిప్రాయములే నాయుద్యమమున కధికప్రోత్సాహకరములైనవి.

ఇప్పుడు శ్రీరామచంద్రుని కరుణాకటాక్షముచేతను, నాయందు గౌరవాభిమానములుగల పెద్దల యాశీర్వాదముచేతను, "ఆంధ్రవిజ్ఞానసమితి"కి నధ్యక్షులును, నాకుఁ బరమపూజ్యులునునగు మ. రా. రా. శ్రీ రావుసాహేబు, వేపకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారి ఔదార్యముచేతను "విస్మృతకళింగాంధ్రకవులు" అను పేర నీగ్రంథమును నాంధ్రలోకమునకు సమర్పించుచున్నాఁడను.

విజయనగరము,
1-6-1940.

ఇట్లు,
అడిదము రామారావు.

# విషయసూచిక.


| | కవి | క్రీ. శకం. | పుట. |
|---|---|---|---|
| 1 | పూసపాటి తమ్మభూపాలుఁడు. | 1620—1700 | 1—21 |
| 2 | పెనుమళ్ల సోమనామాత్యుఁడు. | 1660—1700 | 22—34 |
| 3 | శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలుఁడు. | 1660—1720 | 35—45 |
| 4 | అడిదము బాలభాస్కరకవి. | 1690—1750 | 46—52 |
| 5 | గోకులపాటి కూర్మనాథకవి. | 1720—1790 | 54—64 |
| 6 | రేకపల్లి సోమప్పకవి. | 1720—1790 | 65—76 |
| 7 | కొట్రు బాలకవి. | 1730—1790 | 78—78 |
| 8 | చాట్రాతి లక్ష్మీనరసుకవి. | 1740—1800 | 87—94 |
| 9 | వద్దిపర్తి కోనరాట్కవి. | 1754—1834 | 95—105 |

10 నడిమింటి రామజోగికవి. 106—117

1770—1840

11 పచ్చమెట్ట పాపయ్యకవి. 118—125

1765—1840

12 కాళ్లకూరి గౌరీకాంతకవి. 126—135

1780—1860

13 మండపాక కామకవి. 136—145

1810—1870

14 అడిదము బాలభాస్కరకవి. 146—149

1808—1874

15 కళ్లేపల్లి వేంకటనరసింహమూర్తి. 150—156

1864—1911


---

# విస్మృతకళింగాంధ్రకవులు.



## శ్రీ పూసపాటి తమ్మభూపాలుఁడు.

(క్రీ. శ. 1620—1700 సం॥)

"శ్రీపూసపాటి తమ్మభూపాలుఁడు (ఉరఫు తమ్మిరాజు) దుర్గాసాక్షాత్కారమునుబొంది, తన తపఃప్రభావముచేఁ దా నేలు రాజ్యమున నేడుగడియలకాలము సువర్ణవృష్టిఁగురిపించె"నని ప్రసిద్ధిగన్న మాధవవర్మసంతతివాఁడు. ఈమాధవవర్మసంతతిలోనివాఁడును, 15వ శతాబ్దికడపటిభాగమున దక్షిణహిందూస్థానములో రాజ్యము చేసిన ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడును నగు శ్రీ పూసపాటి రాచిరాజునకు నైదవపురుషుఁడగు గోపాలకృష్ణమరాజీతమ్మభూపాలునిజనకుఁడు. తల్లి జగ్గమాంబ. వీరిరువురినిఁగూర్చియు నీకవి తన కృష్ణవిజయములోఁ గృత్యాదిని నిట్లు ప్రశంసించియున్నాఁడు.

గీ. సుకవినుతులైన యారాజసుతులలోన
నీతికుశలుండు గోపాలనృపునిసుతుఁడు
కీర్తివహియించె గోపాలకృష్ణరాయ
విభుఁడు మజ్జనకుండు దోర్విజయశాలి.

సీ. నిత్యపాతివ్రత్య నియమంబునకు ఠావు
సత్యవాక్యమునకు జన్మభూమి
దీనరక్షణదయావృష్టి కాధారంబు
భాగ్యలక్షణముల పట్టుకొమ్మ
వినయవర్తనముల విహరణస్థాన మ
త్యౌదార్యమునకు నేకాశ్రయంబు
నిరుపమానక్షమానియతికి శరణంబు
దాక్షిణ్యమునకు నాస్థానజగతి
యనుచు సుజనులు వర్ణింప సలరుఁగీర్తి
కృతివినుతుఁడైన గోపాలకృష్ణరాయ
వసుమతీనాథుసతి భాగ్యవతి మదంబ
సకలసుగుణకదంబ శ్రీజగ్గమాంబ.

ఈకవి తన రాజ్యమునుగూర్చిగాని రాజధానినిగూర్చిగాని తన గ్రంథమం దెచ్చటను స్పష్టముగ వివరించియుండలేదు; కాని గ్రంథమునందు వేసికొనిన గద్యములోని "మాధవవర్మ వంశాలంకార, శ్రీమన్మహామండలేశ్వర మహీమండలరాయ, మన్నె సులతాను" మున్నగు విశేషణములంబట్టి యితఁ డొక గొప్ప మండలాధిపతిగఁ గన్పింపవచ్చును, గాని యవి వంశపారంపర్యముగా వచ్చుచున్న బిరుదములై యుండవచ్చునని తోఁచెడిని. ఇంతియగాక కృత్యాదియం దీతఁడు తన్నుఁగూర్చి సభ్యులన్న పలుకులుగఁ జెప్పిన—

సీ. అనిమేషవృత్తిఁ గైకొనువారి నిరసించి
యనిమేషవృత్తిఁ గైకొనెడివారు
కౌశికసఖ్యంబు గాదని సిరసించి
కౌశికసఖ్యంబుఁ గాంచువారు
సద్యోవిమానులై చనుట హైన్యంబని
సద్యోవిమానులై చనెడివారు
జీమూతమార్గంబుఁ జెందుట తగదని
జీమూతమార్గంబుఁ జెందువారు
నగుదురు రణాగ్రభూమి నీయహితనృపులు
గదిసి భేరీమహారవాకర్ణనమునఁ
జిత్తమును మెత్తనై భ్రాంతిఁజెందిరేమొ ?
ప్రకట భుజశౌర్య తమ్మభూపాలవర్య.

మున్నగు పద్యము లాతని విక్రమప్రాభవాతిశయము లను స్థిరపఱచుచున్నను జరిత్రములం దీతఁ డొక సామాన్యరాజుగా నెన్నఁబడియున్నాఁడు. విశాఖపట్టణపు "డిస్ట్రిక్టుమాన్యూల్" నందు సంగ్రహింపఁబడిన సమాచారమునుబట్టి చూడఁగా 1652 సంవత్సరప్రాంతమున నీతమ్మభూపాలుఁ డుత్తరసర్కారులకు వచ్చినట్టును, నాకాలమున శ్రీకాకుళములో "ఫౌజుదారుగా నుండిన షేరుమహమ్మదుఖాను నొద్దనుండి కుమిలి, భోగాపురము లను నిజారాకుఁ బుచ్చుకొని మహమ్మదీయప్రభుత్వమునకు లోఁబడి యొక చిన్నరాజై యుండినట్లును గనఁబడుచున్నది.

ఈతనిఁగూర్చి "డిస్ట్రిక్టుమాన్యూయలులో" నిట్లున్నది:—"పూసపాటి వారివంశములో మాధవవర్మగారు [?] అప్పుడు శ్రీకాకుళం సర్కారులో నొకభాగముగా నుండు విశాఖపట్టణముజిల్లాలోనికి వచ్చిరి. 1652 సంవత్సరములో ననఁగా రారాజగు నౌరంగజీబు వారివలన గోలకొండ రాజవంశము నశింపుచేయఁబడకపూర్వము 35 సంవత్సరములకింద టవారు వచ్చుట జరిగినది. అప్పటిలో షేరుమహమ్మదుఖాను శ్రీకాకుళములో ఫౌజుదారుగానుండెను. ఆయనవద్ద మాధవవర్మగారు కుమిలె, భోగాపురములను విజారా చేసిరి. (కార్మికల్ దొరవారి యింగ్లీషుగ్రంథమునకు విజాపురపు వేంకటకోదండరావు పంతులుగారి తెనుఁగుతర్జుమా 501 వ పుట)

కార్మికల్ దొరవారిచే నీయఁబడిన మీఁదిసమాచారమునకుఁ బ్రమాణమేమియో వారు చూపరైరి. క్రీ. శ. 1652 సంవత్సర ప్రాంతమున శ్రీకాకుళం సర్కారునకు షేరుమహమ్మదు ఖానుఁడు ఫౌజుదారుగానుండినట్లు *"డిస్ట్రిక్టుగెజటీయరు"నందుఁ గూడఁ గనఁబడుచున్నది. కుమిలె భోగాపురముల రెండింటిని షేరుమహమ్మదు తమ్మభూపాలున కిచ్చినట్లు "మ్యాన్యూయల్"

*Two of these chiefs were the ancestors of the present Maharaja of Bobbili and Raja of Vizianagaram, who entered the district in the train of Sher Mahammad Khan (name; father of Sher Mahammad Puram near Chicacole) who was Fouj-dar in 1652 (Gazetteer of the Vizagpatam District—Page 30).

చెప్పుచున్నది, గాని యంతకును స్నికుమిలె స్థానీకులగు పూసపాటివారియధీనములో (The Local Pusapaties) నున్నట్లుగఁ గొన్నియాధారములు గానఁబడుచున్నవి. విజయనగరమునకు సమీపముననున్న వేంకటరాజపుర మను నామాంతరముగల కొత్తాంఅగ్రహారమును బ్రాహ్మణులకు దానముగానిచ్చిన ఉపాభ్యుదయకర్తలగు శ్రీ పూసపాటి వేంకటపతిరాజు మహారాజులుంగారు వారిగ్రంథమునం దీతమ్మభూపాలునిఁ గూర్చి ప్రశంసించియున్నారు, గాని యాతనిరాజ్యమునుగూర్చిగాని, నివసించియుండిన పట్టణమునుగూర్చిగాని యేమియు వివరించియుండలేదు. ఈమొదలగు కారణములచేత "డిస్ట్రిక్టు మ్యాన్యూల్"లో నీయఁబడిన వృత్తాంత మెంతవఱకు విశ్వాసార్హమో బాగుగఁబరిశీలింపవలసియున్నది. అట్టిపరిశోధనగావించి యందలి యథార్థమును గనుఁగొనువఱకును దమ్మభూపాలునికాలము పదునేడవశతాబ్దోత్తరభాగమనుటయేసమంజసమని తలఁచెదను.

ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడగు పూసపాటి రాచిరాజీతమ్మభూపాలునకు నారుతరములు క్రిందటివాఁడు తరమునకు 30 సంవత్సరములు చొప్పున లెక్కించిచూచినయెడల నీకవికాలము 17 వ శతాబ్దముయొక్క యుత్తరభాగమునకు సరిపోవుచున్నది.

ఇంతియేగాక, కొత్తాంఅగ్రహారపు దానశాసనముయొక్క కాలము క్రీ. శ. 1715. ఇదియే మొదటిమానందరాజుగారి

రాజ్యకాలము. కొత్తాంలగ్రహారమును దానముచేసిన వేంకటపతిరాజుగారును, నీయానందరాజుగారును సోదరులు. వీరికి నడుమఁ దమ్మిరాజుగారి (Alias తమ్మ భూపాలుఁడు) తమ్ముని కుమారుఁడు సీతారామరాజుగారు పదునేను సంవత్సరములు మాత్రము రాజ్యము చేసిరి. దీనినిబట్టి చూచినను దమ్మభూపాలునికాలము 17 వ శతాబ్దిచివరభాగముగనే కనఁబడుచున్నది.

కృష్ణవిజయము కృత్యాదిపద్యములయందు నీయఁబడిన కృష్ణానదీవర్ణనము, విజయవాటికాపురవర్ణనము మున్నగు వాటిని బట్టిచూడఁ గవి యీకృతిని 1652 వ సంవత్సరమునకుఁ బూర్వమే వ్రాసియుండవలయునని తోఁచెడిని.

## గ్రంథకర్తృత్వమునుగూర్చి చర్చ.

ఈకృష్ణవిజయ కర్తృత్వమునుగూర్చి వివాదముకూడఁగలదు. అచలాత్మజాపరిణయము, బృహన్నాయకీయము మొదలగు గ్రంథములను రచించిన క్రొత్తలంక మృత్యుంజయుకవి ధనాశకులోనై దీనిని దమ్మభూపాలునిపేర రచించెనని కొందరియభిప్రాయము. అట్టి యభిప్రాయమును స్థిరపఱుపవలెననియో మఱి యేకారణముననో *"అచలాత్మజాపరిణయము"నకుఁ బీఠిక వ్రాసినవా రెవరో శ్రీకృష్ణవిజయమును విజయనగరమహారాజుగారికిని, ధరాత్మజాపరిణయమును అల్లూరి అప్పలరాజునకును, షట్చక్రవర్తి

* కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలలో ముద్రితము.

చరిత్రమును మల్లారెడ్డికిని ఈమృత్యుంజయకవిరచియించియిచ్చి నట్లుగా వ్రాయుచు రేకాని, యట్టి తమవ్రాఁతకుఁ బ్రమాణమే మో యందుఁజూపరైరి. ఇట్టిసమాచారము రాజకవులకృతులతో సంబంధించియుండుట మనకు వింతకాదు. ఆముక్తమాల్యదను రచించిన కృష్ణదేవరాయలంత మహనీయునకుఁగూడ నిట్టివాదుక కలిగియున్నదిగదా ! రాయలు విద్యాధికుఁడని ప్రసిద్ధియుండి నను, మనుచరిత్రాముక్తమాల్యదలకు శైలి మొదలగువాని యందు భేదము కనఁబడుచున్నను, "ఆముక్తమాల్యద" కర్తృత్వము పెద్దనార్యునకే యారోపించుచు, లక్షణగ్రంథములు వ్రాసిన మనపూర్వకవులు కొందఱు లక్ష్యములఁజూపుపట్లను "పెద్దన్నగారి యాముక్తమాల్యద"యని వ్రాసియుండలేదా ! కాని గ్రంథము బాగుగఁబరిశీలించి చూచినప్పుడును, యుద్ధాది వర్ణనలఁబట్టిచూచినను గవి, క్షత్రియుఁడై యుండవలయునని తోఁ పకమానదు. అంతియగాక (శ్రీ) వీరేశలింగంపంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రమందు మూఁడవభాగమున నాధునిక కవులలో నీమృత్యుంజయకవినిఁ జేర్చియున్నారు. ఇతఁడు నూరు సంవత్సరములక్రిందటికాలమున నున్నవాఁడనియు గోదావరి మండలములోని "గోష్ఠి"యను గ్రామమున నితని మునిమనమ లిప్పటికి జీవించియున్నారనియు వ్రాసియున్నారు. అందుచే 18 వ శతాబ్దములో జీవించియున్న మృత్యుంజయకవి 17 శతాబ్దమధ్యభాగమున రచింపఁబడిన కృష్ణవిజయముతో సంబంధము

కలిగియుండుట యసంభవము. ఇంకను ఈ పూసపాటివంశమునందలిరాజులు కొందఱు కవులై యుండుట యనుశ్రుతముగా వచ్చుచున్నది. తమ్మభూపాలునకుఁ బూర్వ మొకఁడిద్దఱుకవులున్నట్లుగ వినియెదము. తరువాతివారిలో వేంకటపతి మహారాజులుంగారు "ఉషాభ్యుదయమును," శేఁగులవలసపూసపాటికుటుంబములోని విజయరామరాజుగారు "విష్ణుభక్తిసుధాకరమును" "వ్యాహారాలక్షణము"ను, రచించియున్నారు. అంతేకాక వంశమందలిరాజులందఱును విద్యాధికులు కవిపోషకులు. పద్మనాభయుద్ధమునందువీరస్వర్గమునుగాంచిన శ్రీచినవిజయరామమహారాజులుంగారు సంస్కృతాంధ్రములయందుఁ గవిత్వముచెప్పసామర్థ్యముకలవారని మనకు లభ్యములైయున్న శ్లోకములవలనను బద్యములవలననుదెలియుచున్నది. ఆప్రభువరునిదని వాడుకలోనున్న యొకసంస్కృతశ్లోకమిందుఁబొందుపరుపఁబడుచున్నది.

శ్లో. అంభోజంకలయన్ సదృక్షమవనే సాహిత్యరీత్యాంద్భశోః
మాంధాతార మపారసంపది మహాభావే యశోరాశిషు
శత్రూణాం పురభంజనే ధృతిగుణే కించోరగేంద్రంమతిః
ప్రాగల్భ్యైఃప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః.

ఆకారణముచేత నీకృష్ణవిజయకర్తృత్వము తగినన్ని ప్రబలనిదర్శనములఁజూపక మార్చివేయుట న్యాయ్యముకాదు. ప్రాభవమున్నచోట విద్య యుండఁగూడదా? రెండును నొకచోట నిలిచియుండుట యరుదైనను గావచ్చును.

## గ్రంథప్రశంస.

ఈ కృష్ణవిజయ మైదాశ్వాసముల ప్రబంధము. దీనిని వ్రాయుటకుఁ దన సామాజికుల ప్రోత్సాహమే కారణమని కవి యిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. సంశయమేల యిచ్చటను సర్వగుణాధికులై సయుక్తి సి
వంశము భూవరుల్ సుకృతవంతులు గావున నందు నిప్పు డే
నాంశము సంజనించి చరితార్థులఁ జేసెను వారి నెల్లఁ ది
గ్మాంశుకులావతంస! సమరార్జున! యుద్ధకిరీటభూషణా!.

చ. హరి విశిధావతారములయందును ప్రశస్తము కృష్ణమూర్తి యం
దరివరసంఘశోకములఁ గావను రేఁ ప్రాఁడు విన్నవింపఁగా
నరకునిసంహరించి లలనామణులం బదియారువేల మున్
బరిణయమైనయక్కథఁ ప్రబంధముగా నొనరింపఁగాఁదగున్.

కం. అను సభ్యుల వాక్యంబులు
విని నామదిలోనితలఁపు విబుధులవచనం
బును నొక్కటయ్యె నగునని
యనుమోదాపూరణాంతరాత్ముండ నగుదున్.

ఇందుఁ బ్రథమాశ్వాసమునఁ గృత్యాదిపద్యములును. కృతికర్తవంశావళియును శ్రీకృష్ణునిపురమును ద్వారకాపురము వర్ణనమును శ్రీకృష్ణునివర్ణనమును గలవు.

## పురవర్ణనము.

చ. బలరిపుపన్నగాధిపుల పట్టణముల్ దమలోన హెచ్చుగుం
దులకయి పోరఁగా నది గనుంగొని మాన్పఁదదంతరంబునన్
నిలిపె విరించి యప్పురము నిశ్చయమిట్టిదె కాకయున్నచో
సలలితహర్మ్యఖేయజలసంతతి రెంటిని నంటనేఁటికిన్.

ద్వితీయాశ్వాసమున వినోదముగానున్న నాయకుల యొక్క సమరక్రియానుకూలమగు శరత్కాలవర్ణనము, నాయకునియందుఁ గాలోచితమైన భావపరిణామము, దేవలోకమందు నరకుని దుర్నయములును, వానిబారినుండిఁ దమ్ము రక్షింపఁ గృష్ణుని వేడుటకు దేవేంద్రుఁడు వచ్చుటయు, శ్రీకృష్ణదేవేంద్రుల పరస్పరమర్యాదలును, నింద్రుఁడు నరకుని యుద్రేకముల నుగ్గడించి చెప్పి యతని సంహారమునకై శ్రీకృష్ణుని సిద్ధపరచుట శ్రీకృష్ణుని నిశ్చయమును, వైనతేయునిరాకయును, సత్యభామ కృష్ణునితో వచ్చుటకు నాతని వేఁడుకొనుటయు, వందులకు శ్రీకృష్ణుని యంగీకారమును, సత్యభామాశ్రీకృష్ణుల ప్రయాణమును, మార్గమునందలి విచిత్రములను శ్రీకృష్ణుఁడు సత్యకు నిరూపించిచెప్పుటయు, నట, నరకునిపట్టణమున దుర్నిమిత్తములు పుట్టుట, రాజనీతి ప్రసంగము మున్నగునవి యభివర్ణింపఁబడినవి.

## శరద్వర్ణనము.

ఉ. ఏరులు గ్రుంగఁ, గేకి రుతహేల లణంగ, నవీనకాంతిఁ బం
కేరుహముల్ చెలంగ, రణకేళికి శూరులుఁ బొంగ, మేఘ సం
చారముబ్రుంగఁ, గోపనలు శాంతి యెరుంగ, వియోగిచిత్తముల్
సారెఁగరంగ, రంగలరు శారదవేళ గడంగె నత్తఱిన్.

## నరకుని దుర్ణయములు.

సీ. కల్పితాభీష్ట సంకల్ప సంతతులట్లు
కల్పసంతతులు వైకల్యమొందె
సుందరీసందోహనందన శ్రీయట్లు
నందన శ్రీ నిరానందమయ్యె
సమదనిర్జరచమూ శతకోటి గతియట్లు
శతకోటిగతి పరాహతిఁ దలంకె
అభిరామరత్న హర్మ్యభోగములయట్లు
భోగంబులన్నియుఁ బోడవుదరిగె
గీ. పంకరుహనాభ ! నాభాగ్యపాటవంబు
లెన్ని యవియన్ని వర్ణింపనెట్లునేర్తు;
శరణమిఁక శరణాగతస్వాంతతోష
కరణమగు నీదు కరుణయొక్కటియె మాకు.

ఈసందర్భముననే నాచనసోముని యుత్తరహరివంశమున నిట్లున్నది.

చ. చోరనిబిలంబులున్ వెడలఁ జూడని క్రంతలు గాలురాపడం
దిరుఁగని త్రోవలున్ విడియ దీర్పనిగొందులు నాలుబిడ్డలే
కరయని రేలఁ జీమచిటుకన్నను విప్పని మూకలుం బయిన్
జిరుఁగని చీరలున్ గలవె చేరిన యీసురకోటి కచ్యుతా!
క. ఇటమీఁద నాకు నరకుఁడు
కుటిలమతిం గీడు సేయఁ గోరెడు నతనిన్

జటులతరచక్రధారా
త్రుటితశిరఃకములఁ జేయు తోయజనాభా !

ఈసందర్భమున నుత్తరహరివంశమునందుఁగాని, శ్రీమద్భాగవతమునఁగాని సత్యభామా శ్రీకృష్ణుల సంభాషణలు పెంచి వ్రాయఁబడియుండలేదు. ఈగ్రంథమున మాత్రము పదునైదు పద్యములకుఁ దక్కువగాకుండగ నీసంభాషణము విపులముగను జమత్కారముగను రసోచితముగను వ్రాయఁబడి యున్నది. ఉదాహరణమునకుఁగా నొకటి రెండు పద్యము లిచ్చటఁజూపఁబడినవి.

మ. చపలాలోకములుంబయోధరవిలాసంబున్ రసోత్కర్షమున్
విపులానందము మీఱఁగా నెరపి ప్రావృట్కాలపున్ లీల వే
రుపడం జేసి మదీయయాత్రకును సంరోధంబు గావించెదో
యిపుడీరాకకు నేమికారణము తన్వీ? వేగ భాషింపుమా !

సీ. చిలుకపల్కులుగావు చెలిమితోవిననీకు
సమదభటాట్టహాసములుగాని
చెలులభూములుగావు చేరికన్గొననీకు
నమరారివికృతవేషములుగాని
గృహదీర్ఘికలుగావు క్రీడసేయఁగనీకుఁ
బ్రకటరక్తస్రవంతికలుగాని
విరులవేటులుగావు వేగడాయఁగనీకుఁ
గఠినబాణప్రయోగములుగాని

చారుసరభసలీల సంచారవన వి
హారములుగావు వేడ్కసేయంగనీకు
భయజనక సాహసాహవక్రియలుగాని
బేలతనమేల నీకింత నీలవేణి ?

— ఈసందర్భముననే భాగవతమున నిట్లున్నది. —

సీ. సమదపుష్పంధయ ఝంకారములుగావు
భీషణకుంభీంద్ర బృంహితములు
వాయు నిర్గతపద్మవన రేణువులుగావు
తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణ జలతరంగా సారములుగావు
శత్రుధనుర్ముక్త సాయకములు
కలహంససారసకాసారములుగావు
దనుజేంద్ర సైన్యకదంబకములు
కమలకల్హారకుసుమసంఘములుగావు
చటుల రిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య నీవేడ, రణరంగ గమనమేడ,
వత్తువేగమ నిలువుము వలదు వలదు.

తృతీయాశ్వాసమున శ్రీకృష్ణునిపాంచజన్యముచేఁ బుర
మునందలి యోధులు యుద్ధసన్నద్ధులగుట, మురాసురుని యుద్ధ
ము, నరకుఁడు శ్రీకృష్ణుని నెదిరించుట, సత్యభామ యుద్ధము
నకు సిద్ధమగుట, నరకునియదలింపు, శ్రీకృష్ణుని ప్రత్యుత్తరము

శ్రీకృష్ణుని విజయము, భూదేవి ప్రత్యక్షమై పౌత్రునిచే ప్రమో క్షించి శ్రీకృష్ణునభయము వేడుకొనుట, శ్రీకృష్ణభగవానుఁడు ప్రసన్నుఁడగుట, భూదేవి వర్ణనము మొదలగునవి యభివర్ణింపఁ బడినవి.

## సత్యభామయుద్ధము.

సీ. సకలసాధ్వీమణి సహజసౌశీల్య ధ
ర్మముఁబూని నట్లు ధర్మంబుఁబూనెఁ
దారకాభస్థూలతర మౌక్తికములందు
గుణముఁగూర్చిన యట్లు గుణముఁగూర్చెఁ
దరిఁజేరుచున్న రత్నములందు కొనఁగేల
శరధిఁజూచిన యట్లు శరధిఁజూచె
జలకేళిఁజాల మత్సరముతోఁ జెలిమీఁద
శరము లేసిన యట్లు శరము లేసె
వింతపనియన్న చింత యొకింత లేక
తనకు నభ్యస్తమైన చైదంబుగతినె
సముదితాశ్చర్య సంభ్రమదమరమైన
సమరమొనరింపఁజొచ్చె నాచంద్రవదన. ఆ. 3-88

సీ. నవమందహాస కందళలీల హరిచోట
నరిచోట నట్టహాసాంకురంబు
అమృతంబుఁ జిల్కు నెయ్యంపుఁబల్కు హరిచాయ
నరిచాయఁ గోపనిష్ఠురతరోక్తి

విరితూపు ఘూపు బిత్తరిచూపు హరిచెంత
నరిచెంత శిఖిశిఖాభరనిరీక్ష
చటుల విస్ఫూల్లతా సమవృత్తి హరిపజ్జ
నరిపజ్జ ననలకీలానువృత్తి
నెలయశృంగారరసమును వీరరసము
నిరుదెసలయందు వెదఁజల్లు నిగురుఁబోఁడి
పోణిమి తెఱంగుఁ గాంచు గీర్వాణలీల
వేణులాశ్చర్య రసధుర్య వాణులైరి. ఆ. 3-92

ఈసందర్భమున నాచనసోముని యుత్తరహరివంశమున నిట్లున్నది.

మ. అరిఁజూచున్ హరిఁజూచుఁజూచుకములందందందమందారకే
సరమాలామకరందఘర్మసలిల స్యందంబు లందంబులై
తొరఁగన్ బన్మ్యోదకోంగోకింతదోలఁగన్ దోస్తోశరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచున్ దన్వంగి కేళీగతిన్.

ఉ. ఏఁచినకజ్జవంచని పయోరుహలోచన మింటమంటలన్
బూఁచిన బాణజాలమునఁ బూర్వసుపర్వపురాణగర్వమున్
వేఁచిన చందమున్ విపుల వీరరసంబున నాత్మచిత్తముం
దోఁచినచందముం దెలియఁదోఁచిన నచ్చెర లిచ్చ మెచ్చరే.

ఈసందర్భమున శ్రీమద్భాగవతమున:—

మ. పరుఁజూచున్ వరుఁజూచునొంపనలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబుశృంగారముల్

జరుగంగన్నులఁ గెంపుసొంపుపరఁగం జండాస్త్రసందోహమున్
సరనాలోకసమూహమున్ నెరపుచున్ జంద్రాస్యహేలాగతిన్.

మ. అళినీలాలకమూడ నొప్పెసఁగఁ బ్రత్యాలీఢపాదంబుతో
నలఘుస్వేద వికీర్ణ జాలకలతో నాకర్ణికానీత స
ల్లలితజ్యాఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై.

ఈ "కృష్ణవిజయమును" భాగవతముతోను నుత్తరహరి వంశముతోనుసరిపోల్చి చూచినప్పుడు, కవి భాగవతమునే చాల వఱకు ననుసరించినట్లుగను, నందలికథనే తన ప్రబంధమునకు ముఖ్యాధారముగాఁ జేసికొనినట్లును మనకుఁ దెలియఁగలదు. ఇంతవఱకు జరిగిన కథతోనే గ్రంథము పూర్తి కావలసి యుండును గాని, కవి యీసందర్భము ననుసరించి వేఱొండు విజయమునుగూడ నిందుఁ జేర్చియున్నాఁడు. అయ్యది పారిజాతాపహరణకథ. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు దేవతలు తన యందుఁ జూపిన కృతఘ్నతను సహింపక వారి నుచితరీతి శిక్షించెనని యిందు స్పష్టపఱుపఁబడియున్నది. పారిజాతాపహరణము నందలి నారదప్రవేశమును, సవతులకయ్యమును శ్రీకృష్ణుని సత్యభామ తన్నుటయు మొదలగునవి పూర్తిగ విసర్జింపఁ బడినవి.

ఇందలి చతుర్థాశ్వాసమున శ్రీకృష్ణభగవానుఁడు నరకుని కుమారుఁడు చేయు నాతిథ్యమును బొందుటకై పురిలోనికిఁ జని

యందలి వైభవములనుజూచుట, చెఱియందున్న దేవకన్యలు శ్రీకృష్ణుని మోహించుటయు, శ్రీకృష్ణునకు వారియందలి యనురాగమును, దేవకన్యలచిత్తము శ్రీకృష్ణునియందు లగ్న మగుటయుఁ గవి దీనిని సాయూజ్యమోక్షముగా వర్ణించియున్నాఁడు. పిదప సాయంకాలము, చీఁకటి, చంద్రుఁడు, రాజనీతి మొదలగువాని వర్ణనమును, ద్వారకకు సురకన్యల ప్రయాణమును, దేవేంద్రునిఁ జూడఁ గృష్ణుఁడమరావతికిఁ బోవుట, అమరావతీపురవర్ణనము, దేవనదీఃలాసాతిశయము నగరునందు జరిగినమర్యాదలు మొదలగునవి గలవు.

## స్వర్నదీవర్ణనము.

సీ. అంగీకృతాభంగ సంగీతభంగిక
భృంగీకులానోన్య సంగమంబు
కేళీపదాళీ మరాళీవరాళీచి
రాలింగితరథాంగ బాలికంబు
భూమామరక్రాంత రామాకరగ్రాహ్య
హేమారవిందాభిరామతమము
ధీరానిలాధూత తీరాధికస్ఫీత
సారాగసారభోద్గారయుతముఁ

గీ. త్రిజగదకలంకవిదళ నోదీర్ణపూర్ణ
వారియనివారితోగ్ర భూవారియచల

దారినగరేందిరామ హారోదారహీర
కాంచి యిదికాంచితే యభ్రగంగయబల !.

చ. అల జలజోద్భవుండ నిలజాదులఁ గెల్వఁగలేని చిత్తజుం
దెలియఁగ గాంచి తజ్జయము దిగ్గనవానికి నీఁ దలంచి యీ
నలినశరంబులన్నియుఁ గనత్కనకంబునఁ జేసెఁ జూచితే
వలయుఁ గదాజగంబుల సువర్ణులగెల్వ సువర్ణకాండముల్.

## శచీసత్యభామల యన్యోన్యమర్యాదలు.

ఉ. అంతటఁసత్యభామ వినయంబమరంగ సుపర్వదూతికా
సంతతివచ్చి తోకొనుచుఁ జయ్యననేగఁ దదీయమైన శు
ద్ధాంతగృహంబుఁజొచ్చి యమరాధిపునమ్మకు నర్మిలిన్ శచీ
కాంతకుమ్రొక్కి వారుఁదనుఁగౌగిటఁజేర్చిబహూకరించుచున్.

పంచమాశ్వాసమున వసంతాగమము, శృంగారరసోద్రే కము, పారిజాతాపహరణము, దేవేంద్రునిపై శ్రీకృష్ణునివిజయము, ద్వారకాపురాభిగమనము, దేవకన్యకలవిరహము, పెద్దల యనుమతిని శ్రీకృష్ణుఁడు వారినందఱను వివాహమాడుట, కల్యాణమహోత్సవము, వనవిహారము, పుష్పాపచయము మొదలగు నవి వర్ణింపఁబడినవి. పారిజాతమును బెకలించుట శ్రీకృష్ణుని విలాసముగనే యిందుఁ గవి వర్ణించెనుగాని సత్యభామకు దాని తోఁ బ్రసక్తియున్నట్లు వ్రాయలేదు.

గీ. అమితనిజదాన మహిమతో సమతఁగాంతు
నంచు గర్వించు నిదియన్నయలుకఁ బోలెఁ
గృష్ణుఁడవ్వేళఁ దనవలకేలలీలఁ
బట్టిపెకలించె నాదివ్యపాదపంబు. 5 ఆశ్వా.

చ. వనితయొకర్తు కృష్ణుఁ గనువాంఛమదిం బెనఁగంగనేగి త
త్కనకగవాక్షపంక్తినెడఁ గానకనొక్కలతాంగి మూపుపై
ననువుగ నెక్కి చూచె నది యాభరమేమియుఁ గానదయ్యె నా
ఘను నెడలగ్నమై మనసు గ్రమ్మరవచ్చుట లేకయుండగన్.

సీ. వకులాగమాశోకముకులాగ్రగానేక
సకులాంగనానీక చంచరీక
మమితానవాసార సుమితాగ్ర్యసహకార
దమితార్యమునివార ధైర్యసార
మసమాన విటపాంతలసమాన సుమసంత
తిసమానతానంతతిలకవంత
మటనానలసమీరనట నాయితవిహార
ఘటనాదికోదారకర్ణికార

గీ. మదయహృదయజ శిఖిసముదాయనిరత
దళితవిచలితనిజమతి కలితవిరహి
కటులలితమృదునవరవచటుల శుకపి
కాననముఁగాంచి రొకకేళికాననంబు.

సీ. శ్రుతిపారగత పురోహితముఖోదితమంత్ర
మధురారవములన్ని మందిరముల
సరసచిరంటికాసందోహకల్యాణ
గీతంబులన్ని నికేతనముల
పణవడిండిమశంఖపటహాదివాద్యని
నాదంబులన్ని గృహాంతరముల
గాఢసమ్మదయుతప్రౌఢవందిస్తోత్ర
కోలాహలములన్ని యాలయముల
గీ. హెచ్చువేడుకఁ గానకల్ దెచ్చు ధరణి
విభులసందడు లన్నినివేశములను
గలుగ నక్కన్యకలనెల్లఁ గౌతుకమున
నన్నిమూర్తుల హరి పెండ్లియాడెనపుడు.

ఈతీరున నీకథల రెంటిని మిగులమనోహరముగా సమ్మే శనము చేసి యీతమ్మభూపాలుఁడు తనకల్పనాకౌశలమును జూపి యున్నాఁడు. ఇంతవఱకు నీయఁబడినపద్యములనుబట్టి కవికిఁగల నిరుపమానసాహితీపటిమయుఁ గల్పనాకౌశలమును దేటఁబడఁ గలవు. కవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కనిపాండిత్యము కలదు. ప్రథమాశ్వాసమునందు దండకమునఁ జేయఁబడిన దుర్గాస్తవము కవికిఁగల సంస్కృతసాహిత్యమును వెల్లడిచేయు చున్నది. కాళిదాసమహాకవి శ్యామలాదండకము ననుకరించు నుద్దేశముతో దానిచాయనే యీదండకము నీతఁడు జెప్పియు

న్నాఁడు. తృతీయాశ్వాసమున వివిధవృత్తములనువాడి, బంధ కవిత్వమునఁ దనకుఁగల సామర్థ్యముచు వెల్లడించుచు నొకసీస పద్యమున నిష్టదేవతానామగోపనముచు జేసియున్నాఁడు. వసు చరిత్రఫక్కిని గవిత్వముఁ జెప్పవలయుననెడి యభిలాష కవికిఁ గలదని యిందుఁ బెక్కుచోట్లఁ గానవచ్చు శ్లేషయే సాక్ష్యమీయఁగలదు. మొత్తముమీఁదఁ దమ్మభూపాలుని కవిత్వము కద ళీపాకమై, సంస్కృతపదభూయిష్ఠమై, యర్థశ్లేషధారకలదై విరాజిల్లుచున్నయది. ఆధునికప్రాబంధికకవులలో నీతం డుత్తమస్థాన మలంకరింపఁదగిన కవిరాజని నాయభిప్రాయము.

---



## వెనుమళ్ల సోమనామాత్యుఁడు.

(క్రీ. శ. 1620—1700 సం॥)

ఈతఁ డాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. సోమమంత్రి పౌత్రుఁడు. సుప్రసిద్ధాంధ్రకవిశేఖరుఁ డగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికి మునిమనుమఁడు. (7 వ తరము వాఁడు) వీరభద్రుని రెండవకుమారుఁడగు మల్లేశ్వరుఁడు కటక పురాధీశ్వరులగు గజపతులవలన "పెనుమళ్ల" యను నగ్రహార మును బడసినపిదప పిల్లలమఱ్ఱివారు పెనుమళ్లవారయిరి. ఈ విషయము సోమకవి తన కృతియగు "సీమంతినీ కళ్యాణము" కృత్యాది నిట్లు దెలిపియున్నాఁడు.

సీ. ... ... ... ...

మహనీయతేజుఁడౌ మల్లేశ్వరుండంతఁ
దనకార్యదక్షతా ఘనతఁజూచి
మెచ్చి యాకటకేంద్రుఁ డిచ్చిన పెనుమాళ్ళ
యన్నగ్రామమునందు నధివసించె
నాటినుండి తదీయ నామంబుచేత న
న్వయము ప్రకాశంబు నందుచుండె.

... ... ... ...

మల్లేశ్వరుని నాఁటినుండియుఁ బిల్లలమఱ్ఱివారగు నీపెను మళ్లవారు కళింగదేశమునందే నివసించుచు వచ్చిరి. ఈవంశము

నందు మంత్రిపుంగవులు వెలసి వంశవిఖ్యాతిని నిలుపఁగలిగిరి. ఈవ్యాసమునకు విషయమగు సోమనమంత్రి శ్రీవిజయనగర ప్రభువులగు శ్రీపూసపాటివారియొద్దను నీతని పెదతండ్రి బసవ మంత్రి నందాపురాధీశులకడను (ఇప్పటి జయపురాధీశులే ప్రాచీనకాలపు నందాపురాధీశులు) మంత్రులుగా నుండిరి. సోమమంత్రి శ్రీపూసపాటి తమ్మభూపాలమహారాజునకు మంత్రిగానున్న విషయము గ్రంథమునం దిట్లు దెలుపఁబడినది.

సీ. జయవాటికా పురాశ్రయమైన దుర్గాంబఁ
గృపఁగాంచె నే నృపాగ్రేసరుండు
మాధవవర్మ క్ష్మామాధవోత్తమ వంశ భూ
షణుం డయ్యె నే భూభుజుండు
కఠినారిహృదయ భీకరమన్నె సులతాను
బిరుదంబు పూనె నే నరవరుండు
సకల యాచకుల యాశాపూర్తియొనరించు
నభిదాన శూరుఁ డే యవనినేత

గీ. భువనవర్ణితుఁడైన యాపూసపాటి
తమ్మభూపాలకుని సముఖమ్మునందు
మంత్రివై తద్దయా సుధామయకటాక్ష
మహిమగాంచితివయ్య! సోమప్రధాని.

పేరుమహమ్మదుఖానుఁడు (క్రీ. వె. 1652-84) శ్రీకాకుళము సర్కారునకు "ఫౌజుదారు"గా నున్నయపుడే మాధవ

వర్మబిరుదాంచితుఁడు శ్రీపూసపాటి తమ్మభూపాలుఁడు కుమిలి భోగాపురములను "ఇజారా"కుఁదీసికొని విజయనగరరాజ్యమునకు శంకుస్థాపన జేసినట్లుగా "విశాఖపట్టణపు "డిస్ట్రిక్టుమాన్యూల్" మొదలగు చరిత్రలవలనఁ దెలియవచ్చెడివి. దీని కుపబలముగ కీ. శే. గురజాడ శ్రీరామమూర్తి పంతులవారు తమ్మభూపాలకృతమగు కృష్ణవిజయము నుపోద్ఘాతములోఁ గవికాలము 1650 సం॥ర ప్రాంతమని దెలిపియున్నారు. కాఁబట్టి యీ రాజపుంగవుని మంత్రియగు సోమనామాత్యుఁడుఁ గూడఁబదునేడవశతాబ్దోత్తరభాగము వాఁడని చెప్పుట కభ్యంతరము లేదు.

కళాకోవిదుఁడైన యీ సోమమంత్రి, కవితయందమితామోదముఁ జూపెనేగాని జీవయాత్రకు దీనిని సాధనముగాఁ జేకొన్నవాఁడుగాఁడు. రాజ్యకార్యనిర్వహణముతోఁ బాటుకవితాకళాలాలసత్వముచూపిన ఈతఁడు కవిబ్రహ్మయగు తిక్కనుఁ బోలియున్నాఁడు. సోమమంత్రి నాదరించిన తమ్మభూపాలుఁడు రాజగుటయేగాక కవిరాజుఁగూడ నై "కృష్ణవిజయమను" నొక శృంగారరసప్రబంధమును రచించి మించెను. సోమమంత్రి కృత "సీమంతినీకల్యాణము"నకును "కృష్ణవిజయము"నకునుఁ గృత్యాది నిర్మాణమునందుఁ గొంత సాదృశ్యము చూపట్టుచున్నది. బహుశః మంత్రియగు నీకవి తన యేలికకృతి ననుసరించి యుండవచ్చునని నాయూహ. ఈ క్రింది పద్యముల రీతులఁ బరిశీలించి చూచెదముగాక.

సీ. జయవాటికాపురీ సంశ్రయ మద్గ్రామ
హోదేవి కరుణ నీయంద కలదు
సుజనులెన్నఁగఁ గీర్తి సుకృతంబులార్జించు
నభిలాష యెపుడు నీయందకలదు
వంశ్యులనెల్లఁ బావనులఁ జేయుదువన్న
యధికయత్నంబు నీయందకలదు
కావ్య సారాసారగౌరవ నిర్ణయో
దంచిత ప్రజ్ఞ నీయందకలదు
గీ. సత్యవచన సదాచార సౌమనస్య
సాధుసాంగత్య సౌశీల్య సదయభావ
సరసతాసత్త్వ బాహుళ్య సాహసక్రి
యాది సుగుణంబులెల్ల నీయంద కలవు.
ఉ. కావునఁ బూర్వపుణ్యకథ కావ్యముగా నొనరించి యిష్టమౌ
దేవతపేర సంకితము ధీనిధివై యొనరించి తేనియున్
దావకకీర్తి చంద్రికల ధౌతములౌ దిశలెల్ల వంశ్యులున్
బావనులౌను రందఱునుఁ బార్థివశేఖర ! తమ్మభూవరా !
(కృష్ణవిజయకృత్యాది).
సీ. పార్వతీహృదయేశ పదభావనాపావ
నాంతరంగుఁడవు నీవగుటఁజేసి
సప్తసంతాన సంస్థాపనాసంకల్ప
మాత్మఁ బూనిన వాఁడవగుటఁజేసి

ఘనునిఁ బిల్లలమఱ్ఱి పినవీరవిభు నన్వ
యమునఁ గల్గినవాఁడవగుటఁజేసి
ధన మనిత్యమటంచుఁ దగఁ గీర్తిధనమునం
దాసక్తిగలవాఁడ వగుటఁజేసి

గీ. కావ్యమొనరించి భ్రమరాంబికా సహాయుఁ
డైన మల్లేశ్వరునిపేర నంకితం బొ
నర్చి దిక్కులయందు ననంతకీర్తి
రుచులు పచరింపఁజేయ నర్హుఁడవు నీవ.

గీ. అట్టులఁ గావున నీవు నో యార్యవర్య !
పార్వతీశకథాసుధాభరితమైన
యొక్క కావ్యంబుచేసి మాయుభయవంశ
జనులనందఱ మిగులఁ బావనులఁ జేయు.

ఉ. పౌరుషవంతులున్ విపుల భాగ్యసమేతులు ధార్మికోత్తముల్
ధీరులు దానశూరులు సుధీనిపుణుల్ భవదీయవంశ్యులా
పారలు వారికీర్తి విభవంబు జగంబున నిల్పి తేనియున్
సారెకు నీగుణోన్నతిఁ బ్రశస్తి యొనర్చెద రెల్ల సజ్జనుల్.
(సీమంతినీ కల్యాణము కృత్యాదిని)

ఇట్లుభయగ్రంథములందును సభాస్తారులగు సామాజి
కులే కృతికర్తలను గావ్యరచనకుఁ బ్రోత్సహించినట్లు కనఁబడు
టయేగాక పద్యరీతులయందుఁగూడ సాదృశ్యము గాననగును.
రసికావతంసుఁడును విద్వత్ప్రభువును నగు రాజోత్తముని చెంత

నుండుటచేతనే సోమమంత్రి కవితాప్రాగల్భ్యము కడుంగడుఁ బ్రకాశించెను.

ఈకవిప్రవరుఁడు రచించినది సీమంతినీకల్యాణము. ఇది యొక వ్రతప్రభావమునుఁ దెలుపు గ్రంథము. స్థలపురాణము వంటిది. ఇందు సోమవార వ్రతప్రభావము నిరూపణచేయఁబడి నది. ఈపుణ్యకథ పురాణప్రసిద్ధము. "స్కాందపురాణంబున బ్రహ్మోత్తరఖండంబునందు విఖ్యాతమైన సీమంతినీనామ సీమంతినీమణిచారిత్ర మాంధ్రభాషను రచించి" అని గ్రంథాదినిఁ దెలుపఁబడి యున్నది.

శృంగారరసప్రబంధమునకు లక్ష్యముగాఁ గూర్పఁబడిన యీకృతి యైదాశ్వాసములు కలది. అందుఁ బ్రథమాశ్వాసము సీమంతినీజననము,యౌవనాదికము మొదలగు విషయవర్ణనలతో ముగియును. ద్వితీయాశ్వాసమున సీమంతినియొద్దకు యాజ్ఞవల్క్యునిపత్ని విచ్చేయుట, యామె గావించిన ధర్మోపదేశము సీమంతినీ యౌవనప్రాదుర్భావ వర్ణనము, విరహము, చంద్రమలయానిలాద్యుపాలంభన మున్నగునవి చెప్పఁబడినవి. మూఁడవయాశ్వాసమునఁ గల్యాణయాత్ర, సీమంతినీ చంద్రాంగదులవివాహమహోత్సవము, లోనుగాఁగలవిషయములు మిగుల విపులముగ సాంకేతికలక్షణములను బాటించి వర్ణనముఁ గావింపఁబడినవి. వనవిహారము, జలక్రీడ మున్నగునవి చతుర్థాశ్వాసమున వర్ణితములు. ఇఁక నైదవయాశ్వాసమున నత్యద్భుత సంఘ

టన మొకటి కూర్పఁబడి, యమునలో విలాసార్థముగ నోడ 'షికారు' జేయుచుఁ జంద్రాంగదుఁడు నదిలో మునిఁగిపోవ నాగకన్యకల సహాయమున నాతఁడు పాతాళలోకమున కేగుట సర్పరాజతనిని సమ్మానించుట, నాగరాజు, వరప్రసాదముచే రాకొమరుఁడు మగుడ భూలోకమునకే తెంచుట, తిరుగ సీమంతిని చంద్రాంగదుల సంయోగరూపమగు పరిణయోత్సవము మొదలగునవి మిగులఁ జమత్కారముగ వర్ణింపఁబడినవి.

సోమనామాత్యుఁడు కవితాకళయందుఁ గడు నేర్పరి. నిరూప్యవిషయమగు శైవభక్తిని బహు సమర్థతోఁ బ్రకటనఁ గావించి, "శబ్దార్థసంగతచమత్కారంబును ప్రకటిత శివభక్తి పారంబును నగు నూతనకావ్యంబు" రచించుటయును. దాను గావించిన ప్రతిజ్ఞను గడు శ్లాఘ్యముగ నిర్వహించెను. కవి పరమశైవుఁడని గ్రంథమునందలి ప్రతిఘట్టమును, స్పష్టముగఁ జెప్పుచున్నది. యాజ్ఞవల్క్యుని పత్ని గావించిన ధర్మోపదేశసందర్భమున వ్యక్తపఱచిన రుద్రాక్షవిభూతి, పంచాక్షరీ మంత్రప్రభావవర్ణనమును ప్రబలసాక్ష్యము నిచ్చుచున్నవి. వేయేల! యీప్రబంధరత్నము శైవమతావలంబులకుఁ బెన్నిధియని చెప్పుటలో నతిశయోక్తి లేదు. వసంతఋతు వర్ణనాసందర్భమునఁ గూడఁ గవి శైవమతావేశమునే చూపి తనభక్తి గరిమను వ్యక్తీకరించినాఁడు.

ఇట్టిసందర్భముల ననుసరించి కవియొక్క మతావేశపరిమాణమును లెస్సగా గ్రహింపవచ్చును. సీమంతినీకల్యాణము ప్రబంధకవితారీతులఁగూడఁ జాలునట్టి పద్యములకు గనివంటిది. ఆకారణముచే మాదిరిపద్యముల నెంచి యుదాహరించుపని బహుకష్టము.

అయినను గొన్నిపద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాఁడను.

మ. సుమనోధర్మముపూని లోకవిజిగీషుండైన పంచేషునిన్
సుమనోధర్మముపూని యప్పురమహానుగ్గెల్వఁగానోడి యెం
తమహాశూరుఁడొ యాతఁడప్పగయులంతన్ దీర్చుకోఁజాలె ని
త్యము దచ్చిత్తములందు ముక్తివనితావ్యాసక్తిగల్గింపుచున్.

శా. ఆర్యాజన్మనివాస వింధ్యగిరి మధ్యక్షోణిభాగంబునం
దార్యశ్రేణికి నాటపట్టగుటచే సన్వర్థనామంబుతో
నార్యావర్త మనంగ దేశమలరున్ హర్మ్యాది దిక్పాలకై
శ్వర్యశ్రీపరిహాసభాసురగృహస్థవ్రాత సంకీర్ణమై.

ఉ. కోపము వానిసొమ్ము, ఘనుఁ గొంచెము సేయుటవానివిద్య,
చూపోపమి వానివృత్తి పరుషోక్తియె వానిగుణంబు, సాధు
సంతాపము వాని సంతసము,దంభము వానికిఁ గన్నతల్లి యా
పాపపు దుర్జనుం దలఁచుపాపము వాయు నుపాయమున్నదే?

గీ. దుర్జనుని కల్మి దురితంపు త్రోవకగును
సజ్జనునికల్మి పుణ్యంపు సరణికగును

పాము బలసిన గరళంబు ప్రబలమగును
గోవు బలసిన దుగ్ధంబు గురియుచుండు.

సీ. చపలతాపత్రయీ సలిలోగ్రసంసార
ఘోరపారావార తారణంబు
సకలజన్మవ్రాత జాతపాతకమహో
ద్ధతకుంభికుంభ విదారణంబు
నంతకానంతకోపారంభ జృంభణ
క్రూరరూప వికారకారణంబు
బహుతరాయాస సంపాద్యమానానేక
ఘనపుణ్యపరిపాక కారణంబు

గీ. మృత్యుజరరాంతరాధ పరిభూతభేద
జాతవిద్యోతమానజీమూతపటల
విఘటనాపటుచాతుర్యవిస్ఫురత్స
మీరణంబగు రుద్రాక్షధారణంబు.

సీ. విస్ఫుమరసమరేణు విసరకైతవముచేఁ
బసమీఱుభసితలేపన మొసంగి
రసలాలసాయత్త భసలకైతవముచేఁ
బ్రికటరుద్రాక్ష మాలికలొసంగి
కలకంఠకుల కుహూకార కైతవముచే
రమణీయ శైవమంత్రములొసంగి

యాతతకిసలయ వ్రాతకైతవముచే
లలితకాషాయ చేలములొసంగి
గీ. చైత్రనాయకదేశిక చక్రవర్తి
వృద్ధతరులకు నతికృపావృద్ధివెలయ
జిగిదగినయట్టి యొకవింత చెలువమెన్నఁ
బాశుపతదీక్షయొసఁగె విభ్రాజితముగ.

(సీమంతినీకల్యాణము)

ఇంకనొక్కవిశేషము- ఏలకో 18 వ శతాబ్దమధ్యభాగముననున్న అడిదము సూరకవికృతమగు "కవిజనరంజనములోని" పద్యములుకొన్ని, సీమంతినీకల్యాణములోనున్న పద్యములకుఁ బుత్రికలుగానున్నవి. పూర్వకవులను తరువాతివారగు కవులు అనుకరించుట సంప్రదాయసిద్ధమగు నాచారమైయున్నను, వీరిందిరెండుగ్రంథముల యందలిపద్యములలోఁ జూపట్టుసాదృశ్యముమాత్రము కొంతవింతగానున్నది. ఈషద్భేదముతో సూరకవి పద్యములుకొన్ని సోమమంత్రిపద్యములకు ఛాయాపటములవలెనున్నవి. ఇందులకుఁ గారణమిట్లుగా నుండవచ్చునని నాయూహ. సూరకవి జనకుఁడు "శుద్ధాంధ్రరామాయణఘటనావైదుషీధురంధరుఁడు" భాస్కరకవియు, సీమంతినీకల్యాణకృతికర్త, సోమమంత్రియు, సమకాలీనులు, ఏకశాఖీయులు, దగ్గఱచుట్టఱికముగాని దూరపుబాంధవ్యముగాని వీరిరువురకు నుండవచ్చును. భాస్కరకవిగూడఁ దమ్మభూపాలుని పోష్యవర్గములోఁ జేరినవాఁడే.

ఆకారణముచేఁ గవిపండితజనాదరముగల సోమమంత్రి భాస్కరునకు తనకృతిని వినిపించుటయేగాక అర్ధాని ప్రతినొక్కటినిచ్చియుండును. ఆగ్రంథమును సూరకవి బాలుఁడుగాఁ దన విద్యాభ్యాసకాలమునఁ బఠించియుండవచ్చును. ఆకవియందలి గౌరవముచేఁ దనగ్రంథమునందు నీక్రిందనుదాహరించిన పద్యములనువ్రాసి యుండవచ్చును.

గీ. దినదినంబునకొక వింతదిద్దుఁదనము
దినదినంబునకొక వింత తెఱఁగుచెయువు
దినదినంబునకొకవింత తీవుటగలిఁగి
జరిగెనాదంపతుల మిథస్సంగమంబు.

(అడిదము సూరకవి.)

గీ. దినమునొకవింత నెయ్యంపుఁదియ్యఁదనము
దినమునొకక్రొత్తరతి కళావినిమయంబు
దినమునొకవన్నె యుత్సాహమునుజనింపఁ
జనియె నాదంపతుల మిథ స్సంగమంబు (సోమమంత్రి.)

కం. ఎక్కడఁజూచినఁ గాల్బల
మెక్కడఁజూచినరథంబు లిభతురగచయం
బెక్కడఁజూచినఁదామై
కిక్కిరిసెంబైట నాల్గుకెలఁకులసేనల్. (సూరకవి.)

ఉ. ఎక్కడఁ జూచినన్ గజము లెక్కడఁ జూచిన ఘోటకవ్రజం
బెక్కడఁ జూచినన్ రథము లెక్కడఁ జూచినఁ గామినీజనం
బెక్కడఁ జూచిన న్గొడుఁగు లెక్కడఁ జూచినఁ గేతనంబులున్
గ్రిక్కిఱిసెన్ బురంబు నువుగింజకు నొండెడ సేయకుండఁగన్.

(సోమమంత్రి.)

సీ. రాజన్యకోటీరరత్నమరీచులఁ
గరదీపికాప్రభల్గలసి మెలఁగ
నాభీలపటుభేరికాభూరిభాంకృతుల్
మత్తేభఘీంకృతు ల్మైత్రిసలుప
నుర్వీసుర ప్రజాశీర్వాదనాదముల్
విమలవందిస్తుతు ల్వియ్యమంద
వారాంగనాదత్త నీరాంజనాంశువుల్
హైమవేత్రద్యుతులల్లుకొనఁగ
గీ. భద్రకరినెక్కి రూపవైభవసమృద్ధి
దర్శనవ్యగ్రపౌరసంతతికి నేత్ర
పర్వమొనరించుచును సార్వభౌముఁ డపుడు
భూతలాధిపుశుద్ధాంతమునకు వచ్చె. (సూరకవి.)

సీ. పుణ్యాంగనాదత్త భూరినీరాజన
ప్రభలఁ గుండలమణిప్రభలఁ గలియ
సౌధాంగనాజనాంజలి కీర్ణసుమరాజి
హారమౌక్తికరాజి నలముకొనఁగ

గాయనజనగీతి కాయతనాదంబు
చక్రినాదంబును సంఘటింప
నుర్వీసురోదితాశీర్వాదనాదంబు
హేషితారావంబు నెనయుచుండఁ
గీ. బుష్పితోద్యానవనవీథిఁ బోవునవ్వ
సంతుఁడునుఁ బోలె ధారుణీకాంతతనయుఁ
డపుడు పురరాజవీధి యందఱిగియరిగి
జనవరేణ్యుని మొగసాలచక్కి నిలిచె.

(సోమమంత్రి.)

మీఁదిపోలికలఁబట్టి సూరకవికి సోమమంత్రి కవితయం దధికగౌరవముగలదని మన మూహింపవచ్చును. ఇంక 17,18 శతాబ్దములలో వెలసిన ప్రబంధరత్నములలో సీమంతినీకల్యాణ మొకమేలిమిరత్నమని నిస్సందేహముగఁ జెప్పవచ్చును.

# 4. శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలుఁడు.

(క్రీ. శ. 1660—1720 సం॥)

ఈ రాజకవి శ్రీ పూసపాటిమహారాజవంశమునకుఁ జెందినవాఁడు. క్రీ. శ. ౧౭౧౨ సంవత్సరమున నిప్పటి విజయనగర పట్టణము నిర్మింపఁబడకమున్ను శ్రీ పూసపాటి మహారాజులు కుంభిళాపురరాజ్యమునకుఁ బరిపాలకులుగా నుండెడివారు. ఇప్పుడు విజయనగరమునకుఁ దూర్పుగా సుమారు ౮ మైళ్ళ దూరములోనున్న 'కుమిలి' యనుగ్రామమే నాఁటికాలమునఁ గుంభిళాపురనామముతో రాజధానీనగరమై యుండెనని పూసపాటిరాజులకుఁగల పూర్వబిరుదములలోని "స్థలదుర్గకుంభిళాపురనికేతుండును" అను దానివలనఁ దెలియవచ్చుచున్నది.

క్రీ శ. ౧౭౫౭ సంవత్సరమున బొబ్బిలియుద్ధములో వీరస్వర్గముగాంచిన విజయరామగజపతిమహారాజునకు నీ వేంకటపతిమహీరాజు పెదతండ్రి. ఈయన తమ్ముఁడును, విజయరామరాజు తండ్రియునగు ఆనందగజపతిమహారాజు* బాలుఁడై యున్న కాలమున నీ వేంకటనృపాలుఁడే రాజ్యభారమును వహించి తమ్మునికిగాఁ బరిపాలనమొనర్చుచుండెను. విజయనగరమునకుఁ బడమరగా గోస్తనీతీరముననున్న "కొత్తాము" అనుగ్రామము శా. శ. ౧౬౩౭ సంవత్సరమునఁ గ్రీ॥ శ॥ ౧౭౧౫ గొన్ని బ్రాహ్మణకుటుంబములకు వేంకటపతిరాజపురమను పేరుతో నీయనచే

న్నగ్రహారముగా నీయఁబడియెను. ఆదానశాసన మిచట నుదాహరింపఁబడినది.

శ్రీరస్తు "శాకేబ్దే ఋషిరామశాస్త్రశశభృత్సంఖ్యాయుతే మన్మథవర్షే మాధవమాసి భానుజయుతే రాకాదినాబ్జగ్రహే। సింహాద్రే స్నవిధేరఘూత్తమముదే కొత్తాముసంజ్ఞం పురమ్। విప్రేభ్యః ప్రదదౌ సవేంకటవిభుశ్శ్రీపూసపాట్యన్వయః॥

శ్రీమాన్ వేంకటభూపతిః శ్రితనిధిః శ్రీపూసపాట్యన్వయః।
స్మార్తేభ్యోనిఖిలార్థవిద్భ్య ఉరుధీః శ్రీవైష్ణవేభ్యోదదౌ ।
చత్వారింశతమంశమూర్జితతమం కొత్తాముసంజ్ఞంపురం।
కృత్వా వేంకటరాజపట్టణ మితిప్రఖ్యాతముర్వ్యాంసదా ॥

స్వస్తిశ్రీ శాలివాహనశకవర్షంబులు ౧౬౩౭ అగు నేటి శ్రీ మన్మథనామసంవత్సర వైశాఖ శు॥ ౧౫ స్థిరవారమునందు ౧ శ్రీ వొడ్డె జగ్గుభట్లుగారు, ౨ సోమయాజుల వేంకటావధానులు, ౩ కర్రి రామభట్లు, ౪ కర్రా విశ్వేశ్వరభట్లు మొదలయిన బ్రాహ్మణులకు శ్రీ మన్మహామండలేశ్వర మహీమండలరాయ మన్యసుల్తాన్ శ్రీ పూసపాటి వేంకటపతిరాజు మహారాజులుంగారు వ్రాయించియిచ్చిన అగ్రహారపుధర్మశాసనపట్టా:-మా మొఖాసాసమతు పోట్నూరుసీమ తాలూకు కొత్తాం అనే గ్రామములోను యిరవైవక్కవృత్తి నిర్ణయంచేసి యిస్తిమి గనుక యిందుక ౧ వొడ్డెజగ్గుభట్లు, ౨ సోమయాజుల వేంక

టావధానులు, 3 కఱ్ఱిరామాభట్లు, ర కఱ్ఱావిశ్వేశ్వరభట్లు, ౫ బులుసు జగ్గువఝులు,౬ యనమంద్ర విజ్జంభట్లు, ౭ పూరికంటి వేంకటభట్లు ౮ వేదుల యజ్ఞంభట్లు, ౯ ఆతీ నరసంభట్లు, ౧౦ నిట్టల రామాభట్లు, ౧౧ కాశీసోల్ల బుఱ్ఱిభట్లు, శ్రీరంగం నారాయణభట్లు జ్న ౨ కి ౧౨ దేవరకొండ నారాయణభట్లు, ౧3 యఱ్ఱగుంట్ల సూరుభట్లు, ౧ర నిట్టల చినరామభట్లు, ౧౫ అయిస్సోలల చేనులు ౧౬ గంటి సోమయాజులుగారు, ౧౭ వేదుల సీతారాముడు, ౧౮ అవధానుల కామాభట్లు, ౧౯ ఇంద్రకంటి లింగంభట్లు, ౨౦ భాస్కరభట్ల అప్పలిభట్లు, ౨౧ వేదుల విస్సంభట్లు,యీచొప్పున మర్యాదచేసి వేంకటపతిరాజపురం పేరుపెట్టి శ్రీసీతారామార్పణముగాను వాపీకూపతటాకారామనిధి నిక్షేప ప్రజాసహితంగా యిస్తిమిగనుక ఆగ్రామం విరివిగా ఫలపరుచుకొని అందుల ఫలసాయం మీ పుత్ర పౌత్ర పారంపర్యాయం అనుభవిస్తూ సుఖానవుండేది.

ఏకైవభగినీలోకే సర్వేషామపిభూభుజాం।
నభోజ్యానకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా।
స్వదత్తా దుహితాచైవ పితృదత్తాచసోదరీ।
అన్యదత్తాచ మాతాస్యాద్విప్ర దత్తావసుంధరా॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ. వేం.

వేల్పూరి పాపయ్యశాస్త్రి పోట్నూరుపరాబు కొమ్మోజు గురవన్న మండ శివ్వన్న చెక్కినదానపట్టా.

N. B. ఈప్రకారముగానే వేఱొక దానశాసనము ౧౯ వృత్తు లేర్పఱచి శ్రీ అళఘురుతిరుమల గొడవర్తి శ్రీ వేంకటపతి అయ్యవార్లుంగారు మొదలగు వైష్ణవులకుఁగూడ నిదే కాలమున నిచ్చియున్నారు.

దానశాసనము కాలమునుబట్టి చూడఁగా నీ వేంకటపతి రాజకవికాలము క్రీ. శ. ౧౬౬౦-౧౭౨౦ మధ్యకాలముగాఁ గనఁబడుచున్నది. ఈయన అన్నమన్నృపాలుని పౌత్రుఁడు. కృష్ణమరాజుపుత్రుఁడు. తల్లి కేసమాంబ. వీరినిఁగూర్చి యితఁడు తనప్రబంధమగు "ఉషాభ్యుదయములోఁ గృత్యాదిని నిట్లు ప్రశంసించియున్నాఁడు.

సీ. లయకాలకీలికీలాభీలమాలిక
మించి శాత్రవులభంజించువేళ
స్థిరసాంద్రచంద్రికా పరిపూర్ణచంద్రుఁడై
లీలభూజనులఁ బాలించువేళ
దశశతవదనప్రధానభోగీంద్రుఁడై
లలితకళాప్రౌఢి దెలుపువేళ
బహుదళసుమఫలభరితమందారమై
యొనరనరులకోర్కె లొసఁగువేళ

గీ. నీతఁడని సర్వజనులు సంప్రీతిఁగొల్వ
నలరుచుండెనుబూసపాట్యన్వయాబ్ధి
చంద్రుఁడగు కృష్ణరాజేంద్రచక్రవర్తి
నందనుండన్న భూపపురందరుండు.

గీ. అమ్మహీపతి పరిణయంబయ్యె వేడ్క
దనరనీపూరి వేంగళేంద్రునిసుపుత్రి
నమితకళ్యాణకలిత విఖ్యాతమహిత
విమలసద్గుణనికురంబ వేంక ళాంబ.

గీ. ఆ వధూమణియందు నెయ్యంబుతోడ
నన్నభూపతిగాంచె విఖ్యాతులైన
సుతుల నిరువుర నత్యంతశుభగమతులఁ
గృష్ణభూపాలు గోపాలకృష్ణవిభుని.

సీ. శ్రుతిపదరహితుఁడై యతి భుక్షనుబుజగ
త్ప్రాణిభక్షించినవానిఁదెగడి
శిరములఁ గుంభముల్ ధరియించు చాశలఁ
దరలకనిల్చు దిక్కరులఁగెడచి
సానుల శిఖరసంచయముల నెవ్వేళ
మమతఁగైకొను గోత్రసమితిరోసి
ఒకయచలాధిపుండు కణఁకఁదనునంట
వెన్నుజూపిన కూర్మవిభుని మాని.

గీ. చారువిజ్ఞాను నాశ్రితజన నిధాను
నన్యకాంతాస్య విముఖుసౌజన్య సుముఖు
వీరకృష్ణమహీపాలుఁజేరె నార !
ధీరగంభీరమతిని ధాత్రీపురంధ్రి.

గోట్టెముక్కలవంశాబ్ధి కువలయాప్తుఁ
డనఁగఁ జెన్నొందు బంగారు జనవరేణ్యు
తనయయైనట్టి కేసమాంబనువరించె
మజ్జనకుఁడైన కృష్ణక్ష్మావిభుండు.

సీ. తనతండ్రి యెపుడప్పులను భంగమును జెందఁ
గనులక్ష్మి యేపాటి కలిమిపొలఁతి
తనపుత్రకుం డపుత్రకునిగాఁ గనునట్టి
గంగ యేపుణ్యసంకల్పవతియొ
తనపతి బహుళార్తి నెనయఁ గనుంగొను
రోహిణి యేయనిరుద్ధచరిత
తనసుతు పెండ్లిసేయను నేరకమెలంగు
పర్వతాత్మజ యే శుభప్రదాత్రి

గీ. యనఁగవిలసిల్లెఁ బతిహితాయత్తయగుచు
పూసపాట్యన్న మేదినీభుజుని కృష్ణ
రాయవిభురాణి మాధుర్య రమ్యవాణి
కీర్తిసద్గుణ నికురంబ కేసమాంబ.

రాజ్యభారమును వహించుటకుఁ దగినవయస్సు తనతమ్ముఁడగు నానందరాజునకు వచ్చినంతనే యీవేంకట నృపాలుఁడు రాజ్యపాలనాదికము నాతనికిచ్చివేసి తానుగావించిన యగ్రహారమునఁ బ్రత్యహము విప్రులయింటనే భోజనముఁ జేయుచుఁ బారమార్థిక చింతకలవాఁడై పండితగోష్ఠిచేఁ దనజీవితశేషమును నొకరాజఋషివలెఁ గడపెనని వినుచున్నాము.

ఈమహారాజు రాజకీయవ్యవహారములయం దెంతదక్షుఁడో కవిత్వము మొదలగు లలితకళలయం దంతసమర్థుఁడు. తన పూర్వులగు రాచిరాజు (నవభారతకృతికర్త) తమ్మిరాజు (శ్రీకృష్ణవిజయగ్రంథకర్త)లవలెఁ గవితావిషయమునఁ దానుఁగూడ విఖ్యాతినొందవలెనను కోర్కెతో "ఉషాభ్యుదయ"మను నొక శృంగారరసప్రబంధమును రచియించి తమ రాజధానీ నగరమునకు ననతిదూరములో శ్రీరామ తీర్థక్షేత్రమున వేంచేసియున్న శ్రీరామచంద్రునకు నద్దానిని గృతియొసంగెను.

ఈ ఉషాభ్యుదయము ౫ ఆశ్వాసముల ప్రబంధము. ఇందులకథ హరివంశమునందును, భాగవతమునందును,వర్ణింపఁబడిన ఉషానిరుద్ధుల వివాహోత్సవమునే యాధారముగాఁ జేసికొని యీప్రబంధమును రచించినాఁడు. ఇందు మొదటి యాశ్వాసమున—

కృత్యాదిపద్యములును, కృతికర్తవంశావళి, పురవర్ణనాదికము, కైలాసమున బాణునితపము, మహేశ్వరసాక్షాత్కారము, వరప్రదానము మున్నగునవి వర్ణింపఁబడినవి.

ద్వితీయాశ్వాసమున—వసంతాగమము, ఉషాసౌంద ర్యాభివర్ణనము, కేళికావనవిహారము, అచ్చట నుష మొదలగు యువతీజనమునకుఁ బార్వతీపరమేశ్వరుల సాక్షాత్కారము, ఉషాగిరిజలసంభాషణము, నుషాభావిస్వప్నవృత్తాంతమును, సాయంకాలము చంద్రాద్యుపాలంభనము మొదలగునవి చెప్పఁ బడినవి.

తృతీయాశ్వాసము—ఉషాస్వప్నము, విరహము, చిత్ర రేఖయొక్క చిత్రలేఖనాకౌశలము, అనిరుద్ధుని ద్వారకనుండి తెచ్చుట, ఉషానిరుద్ధుల గాంధర్వవివాహము, మున్నగునవి యభివర్ణింపఁబడెను.

చతుర్థాశ్వాసమున—అనిరుద్ధునివృత్తాంతము బాణు నకుఁదెలియుట, వానిఁ గారాగృహబద్ధునిగాఁజేయుట, నారదుని వలన నీసమాచారము ద్వారకలోనున్న శ్రీకృష్ణాదులకుఁ దెలి యుట, కృష్ణుని దండయాత్ర మున్నగునవి వివరింపఁబడెను.

పంచమాశ్వాసము—సంపూర్తిగా దొరకలేదు.

ఈవెంకటరాజకవి చక్కని కవిత్వముఁ జెప్పఁగలవాఁడే యైనను,శ్లేషయందు మిక్కిలి మక్కువకలవాఁడగుటచే సరళమగు కవితాప్రవాహము హృదయావర్జకముగాఁ బ్రవహింపక, తద్ర చనకుఁగొంత లోపము కలిగించుచున్నదని చెప్పవలసివచ్చినది. పండిత కవిసమాజముచేఁ బ్రబంధరాజముగా నాదరింపఁబడు వసు చరిత్రయొక్కకవితావిధానమునే తనకు నాదర్శముగాఁజేసికొనిన

వాఁడగుటచే నిందులోని పద్యములు పెక్కులు వసుచరిత్రలోని పద్యముల ననుకరించుచున్నవి. మొత్తముమీఁద సీతనికవిత్వము సంస్కృతపదభూయిష్ఠమై, యలంకారశోభితమై నిరర్గళ ధార కలదియై కర్ణరసాయనముగ నున్నది. కవికి సంస్కృతాంధ్రముల యందుఁ జక్కనివైదుష్యముకలదని యీప్రబంధమునందలి పద్యములే మనకుఁ బ్రబల నిదర్శనములు. కవితాధోరణి తెలి యుటకుఁగాఁ గొన్ని పద్యములిచటఁ బొందుపఱచుచున్నాఁడను.

కం. కాంతారసహితపల్లవ
సంతతభావనము లలరుసమధికలీలన్
గాంతార సహితపల్లవ
సంతతభావనములందు సమధికమగుచున్.

చ. అచటియనంతరత్నమయహర్మ్యములొప్పనిశాంతమెంతయున్
ప్రచురతఁదానసంత సుఖపద్ధతిచూడఁ బురాంగనల్ సదా
రుచిఁగని మిత్రుఁడంచు నవరోధముసేయరుగాక జాలక
ప్రచురుఁ డదెందుఁబోఁగలఁడుపట్టెదమందురు సౌధసీమలన్.

మ. అలినాథుండు రసాలమంజరుల నొయ్యారంబు దెల్పంగ నా
కులవృత్తిన్ నిజయౌవనోదయ రసక్షోభంబుగాఁ జేయు చా
పలబుద్ధిన్ గినియంగఁబోలునుసుమీ పద్మాక్షి ! యేలాలతా
వలిచాంపేయము నేలఁజుట్టుకొనుఁ దద్వాటిన్ విలోకించితే.

చ. అరఘురథాంగ విభ్రమము నాఁగబిరుందులు గబ్బిచన్గవల్
కరువలివారువంబులును గన్నులు సార్థములై సహాయతన్
బరఁగుటనేమొ గాక లలనామణు లేక్రియ నెక్కఁనోపువా
రరుణ తురంగ ఘర్మసలిలాదృత సాలము కేలిశైలముల్.

సీ. లీలావలిత భంగమాలాధికృత తుంగ
డోలాంచిత పతంగ బాలరంగ
మారాజిత పరాగ సారాభ్యవితభోగ
నీరాటన సవేగ తీరభాగ
మాలంబిత తమాల నీలచ్ఛదవిశాల
బాలక్ష్యతతకూల సాలజాల
మలిచుంబన వికారపుల కోపమితసార
సలతాంత గతసారవళిక నార

గీ. మనత ఘనతరవినుత వరనట దచ్ఛ
మత్స్యపుచ్ఛాంబు బిందుచామరవినోద
కోకకలహంస జలహంసకుల విలాస
భావరుచిరంబు కేళి సరోవరంబు.

కం. అథవాకాకు నినాదము
సథవాగీతస్వనంబు సముదిత పరదే
శథవావిలాపమామ
న్మథవీణకుఁ ద్రివిధతానమానము లెసఁగన్.

సీ. సౌందర్య గగనవిస్ఫార మాధారమై
నవవయః పవనసంతతిని దాల్చె
నవవయః పవనసంతతి పెల్లుగొనిపొంగి
విరహానలార్చుల వెలయఁబూనె
విరహానలార్చు లబ్బురముగా వెలుగొంది
కనుకొలంకుల నీరు కలుగఁజేసెఁ
గనుకొలంకుల నీరుగబ్బియై పొడగట్టి
కుచధరాభ్యుదయ సంగోష్ఠిఁ గనియెఁ

గీ. కుచధరాతస్థలంబునఁ గోమలికిని
వికల చింతాలతల్ సంభవించెఁ బెలుచఁ
బంచశర పరబ్రహ్మ ప్రపంచమునను
తద్విగుణవృత్తితో నవస్థలు చెలంగె.

గీ. జన్మ మమృతాబ్ధి నమృతంబు చక్కదనము
పదవి శంకరమౌళియా బాల్యవసతి
యిన్నిగల్గి యనాథల నేచెదేల
కులము రూపంబు కొలదిఁ సద్గుణమువలదె.

## 5. అడిదము బాలభాస్కరకవి.

(క్రీ. శ. 1690—1750 సం.)

ఎవ్వాగు తమయఖండసాహితీపటిమచేతను, నిరర్గళకవితాప్రభావముచేతను, ఆంధ్రవాఙ్మయనిర్మాతలయ్యిరో, యెవ్వారి జీవితచరిత్రము నామమాత్రావశిష్టమై తమతరువాతివారికి విషాదకారణమయ్యెనో యట్టికవి తల్లజులలోఁ జేర్పఁదగినవాఁడగు నీబాలభాస్కరకవి సుప్రసిద్ధాంధ్రకవిశేఖరుఁడగు నడిదము సూరకవీంద్రుని జనకుఁడు. ఆరువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రవశిష్ఠగోత్రజుఁడు నారపామాత్యుని పౌత్రుఁడు. చినలచ్చనమంత్రి పుత్రుఁడు. కాపురము విజయనగరమునకు సమీపముననున్న భూపాలరాజు రేఁగ (పూసపాటి రేఁగ.)

18 వ శతాబ్దోత్తరభాగమున శ్రీవిజయనగరసంస్థానమున నాస్థానకవిగానుండిన యీతని కుమారుఁడగు సూరకవి, క్రీ. శ. 1720 సం॥ర ప్రాంతమున జననమొందియుంటచే నాతని తండ్రియగు నీబాలభాస్కరుఁ డప్పటికి 25 సంవత్సరముల ప్రాయముగలవాఁడై యుండవచ్చునని మన మూహించినచో నీతఁడు 1690 ప్రాంతమునఁ బుట్టియుండవలెను. అట్లనికొనినచో నీతనికాలము 1690—1750 మధ్యకాలమై యుండనగును. ఈ ప్రకార మూహించిచూడ నీబాలభాస్కరకవి ఉషాభ్యుదయగ్రంథకర్తయగు శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలునకు సమకాలికుఁడుగా నుండనోపును.

సూరకవి తన "కవిసంశయ విచ్ఛేదము"నఁ గృత్యాది యం దీభాస్కరకవిని నిట్లు స్తుతించియున్నాఁడు.

క. చిరలచ్చమంత్రి తనయుని
నసఘుని మజ్జనకు భాస్కరామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలం
ఘనజాంఘిక కవనధాటి గలిగినమేటిన్.

ఈస్తుతినిఁబట్టి చూడఁగా బాలభాస్కరకవి కవితావిష యమున గొప్పసామర్థ్యముకలవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. ఇతని కవనధాటిని నిదర్శనపూర్వకముగాఁ జూపుటకుఁ దగిన సాధనసామగ్రి లేకుండుట యెంతయుఁ జింతాకరము. ఇతఁడు శుద్ధాంధ్రరామాయణఘటనావైదుషీధురంధరుఁడని సూరకవి తన గ్రంథములో వేసికొనిన గద్య యి ట్లుద్ఘోషించుచున్నది. "ఇది శ్రీమదేశేషమనీషిహృదయంగమమృదుపదనీరంధ్రశుద్ధాంధ్రరామాయణఘటనావైదుషీధురంధరాడిదము బాలభాస్కర కవి తనూభవ" అనియున్నది.

దీని కుపబలముగా సూరకవి తన కవి సంశయవిచ్ఛేదములో "ఇడఁగవచ్చునుల్యప్పుపై సిత్వసంధి మాత్ర మొక్కొక్కచోటను మట్టుమీఱు" అను లక్షణమునకు లక్ష్యముఁజూపు సందర్భమునఁ బ్రామాణికగ్రంథములనుండిచూపిన యుదాహరణములతోఁబాటు "బాలభాస్కరకవికృత శుద్ధాంధ్రరామాయణమునుండి" యనివ్రాయుచు.

